## చీనాకు రష్యా సహాయము

ఇకమీదగూడ జరుగుచుండును.

చుంకింగు, ఏప్రిల్ ౨౭:—

తాము యికముందుగూడ చీనాకుసహాయము చేయుచుందుమని రష్యా ప్రభుత్వమువారు మాస్కోలోని చీనా రాయబారి ద్వారా చీనాకు వాగ్దానము గావించిరి. రష్యాజపాను తాటస్థ్య సంధివలన చీనాయెడల తమ విధానము రవమాత్రము మారలేదని రష్యావిదేశాంగమంత్రి చీనా రాయబారికి తెలియజేసెను. రష్యావారిక ముందుగూడ చీనాకు సహాయము చేయుచుందురని అయన స్పష్టము చేసెను.

రష్యాజపాను ఒడంబడిక జరిగినప్పటికి జపాను దక్షిణ పసిఫిక్‌లోకిపర్యవసానదనియు, చీనాలో ముందంజ వేయదనియు పలుకుబడికల పత్రికయగు "టోకింగ్ పో" వ్రాయుచున్నది మంచూరియాలో జపాను 14 సైనికదివిజను లుంచబడెను. మంచూరియాలోని గలట్ల సైనికులు తిరుగుబాటు గావించెదరను భయముండుటచేత తమ సేనలను జపానువారు మంచూరియానుండి తొలగింపజాలరు. అని ఆపత్రిక వ్రాయుచున్నది

### చీనాకు సైనికసహాయము తగ్గెనని జపానువారనుట.

రష్యాజపానుల ఒడంబడిక వలన చీనాకు రష్యా సైనికసహాయము లేకుండ బోయెనని ఒక జపానుసైనికాధికారిఏప్రిలు౨౭వతేదిన చెప్పెను చుంకింగు ప్రభుత్వముపైజపాను ఒత్తిడిపూర్వముకంటె హెచ్చినది. సైనికసహాయము లేనిచోటు నుండి ఆర్థికసహాయ ముండునని తలపరాలులేదు. ఒడంబడికద్వారా ఒకరినొకరు నమ్మి యితరపైపుల తమదృష్టి సారింపవచ్చునని సైనికాధికారి చెప్పెను.

## బర్మాకు అమెరికా సేనలు

బర్మాలో క్రొత్తగా చేర్పరుపబడనున్న సైన్యములో నొకభాగముగా నుండుటకుగాను అమెరికానుండి కొందఱిపటాలము బర్మాకు ఏప్రిలు ౨౫వతేది బయలుదేరి వెళ్లెను.

## తుర్కీనుండి ప్రజలను పంపివేయుట

అంకారా, ఏప్రిలు౨౫.—

బాల్టిక్ రాజ్యములనుండి వచ్చిన బ్రిటిషుశరణాగతులును, ఇటీవల బాల్కనులనుండి వచ్చినవారును మాత్రమే తుర్కీనుండి పంపివేయబడిరి. కొందరు తమంతటతామే వెళ్లిపోయియుండవచ్చును. కాని అందరిని పంపివేయవలెనను ఉత్తరవు బ్రిటిషురాయబారి వర్గముచే గావింపబడియుండలేదు, ఇస్తంబూలునుండి కొందరు పంపివేయుటకై ప్రభుత్వ ప్రణాళికక్రింద ప్రభుత్వఖర్చుపై నెవ్వరు పంపబడియుండలేదు

## జర్మనీపై బ్రిటిషు విమానాల దాడులు

ఏప్రిలు౨౫వ తేదిపగలు బ్రిటిషువిమానాలు ఉత్తరోప్పెయర్థసముద్రతీరమునకర్తల్కపురకోటలన సేనములను పాడుచేసినవి. అనాటిరాత్రి బర్లినుపై ఇదివరకెన్నడుగాని చేయనంతఘోరమైన దాడినిచేసినవి: ఇందులో క్రొత్తవిమానాలు, చాలాశక్తివంతములైన బాంబులుఉపయోగించబడినవి. ఈదాడులనుండి ౫ బ్రిటిషువిమానాలుతిరిగి స్వస్థానాలకు చేరుకొనలేదు.

౨౫వ తేదిన హెలిగోలాండువద్ద రెండువర్తకపుఓడలను, నార్వేసముద్రతీరంవద్ద రెండువర్తకపుఓడలను బ్రిటిషువిమానాలు బాంబులువేసి ముంచినవి ఈనాటిబ్రిటిషువిమానాలు బర్లినుకు పోవునపుడు, అక్కడినుండివచ్చునపుడు కలిసి రెండుజర్మనువిమానాలను క్రిందకూల్చినవి. ఈ దండయాత్రలనుండి బ్రిటిషువిమానాలు తిరిగిరాలేదు.

౨౫వతారీఖున జర్మనీలోకిపోయిన బ్రిటిషు విమానాలలో ఒకటితిరిగిరాలేదు.

౨౦వ తారీఖునరాత్రి బ్రిటిషువిమానాలు వసెల్ డ్రోర్పుమీదను అసెన్ మీదను బాంబులనువేసినవి.

## గ్రామాసములలో విజయము

జనరల్ స్మట్సువిశ్వాసము

ఒకసంవత్సరము లేక ౧౮నెలలలో విజయము తప్పదు. అని కేప్‌టౌనులో ఏప్రిలు౨౫వతేదిన నుపన్యసించుచు దక్షిణఆఫ్రికా ప్రధాని జనరల్ స్మట్సుగారు చెప్పిరి,

## నానారాజ్య సమితి సభ్యత్వమునుండి ఫ్రాన్సు విరమణము

జర్మనీఒత్తిడి ఫలితము

నానారాజ్యసమితిలో సభ్యత్వము మానుకొనుటకు ఫ్రాన్సు నిశ్చయించెను. ఈ సంగతిని అడ్మిరల్ డార్లనులీగు సెక్రటరీజనులకు తెలియజరచెను. ఫ్రాంసు మానుకొనుటవలన నానారాజ్యసమితి అంతమైనట్లు తలచవచ్చును. ఇప్పుడు నానాజాతిసమితిలో మిగిలియున్న గొప్పరాజ్యము ఒక్కఇంగ్లండుమాత్రమే.

అడ్మిరల్ డార్లను జర్మనీవారి చెప్పుచేతలలో నున్నాడనుటకు ఫ్రాన్సు నానారాజ్యసమితిలో సభ్యత్వము మానుకొనుట మరియొక నిదర్శనమని రూటరు రాజకీయవిలేఖరి చెప్పుచున్నాడు తదుమాటచెల్లుబడియైన దేశములవారిచే నానారాజ్యసమితి సభ్యత్వము మాన్పించుటకు జర్మనీవారు పట్టుబట్టిరి

## అమెరికాకు యుద్ధనావలు సహాయంగా పంపబడవు

ప్రెసిడెంటు రూజువెల్టు ప్రకటన

అమెరికానుండి ఇంగ్లాండుకుపోవుసరకునావలవెంట అంగరక్షగా అట్లాంటిక్కుమహాసముద్రములో అమెరికావారియుద్ధనావలు పోవుచున్నవనువార్త కేవలము అసత్యము, అని అమెరికాఅధ్యక్షుడు రూజువెల్టుగారు తమ కార్యదర్శియగు స్టీఫెనుఅర్లీగారిద్వారా ఏప్రిలు ౨౫వతేదిన ప్రకటించిరి.

## గ్రీసులాండు

డెన్మార్కుకు స్వతంత్రము లభించినప్పుడు యిచ్చివేయబడును

డెన్మార్కు స్వతంత్రదేశము కాగానే గ్రీన్‌లాండు తిరిగియిచ్చివేయబడును. ఆ స్వతంత్రప్రభుత్వమునకిచ్చివేయబడునని ఏప్రిలు౨౫వ తేదిన పత్రికాప్రతినిధుల సభలో రూజువెల్టుగారు ప్రకటించిరి. గ్రీన్‌లాండును రక్షించునిర్ణయము మన్రోసిద్ధాంతమునకనుసరించి సైకొనబడెను లిమా, హవానాలలోజరిగిన పాన్ అమెరికను సభలలో గూడ ఈచర్యసమర్థింపబడెను. పశ్చిమార్ధగోళములోని విదేశకాలనీల సర్వాధికారమును ఒకవిదేశీయునినుండి మరియొక విదేశీయునికి మార్చరాదని ఆసభలు నిర్ణయించియుండెను. అనిఅధ్యక్షుడు చెప్పెను.

## డాక్టర్ పీ. రామచంద్ర

మద్రాసు పరీక్షలో వైద్యములో యం. డీ డిగ్రీను పీ. రామచంద్రంగారు పొందినారు. వీరు హైదరాబాదువారు. వీరు హైదరాబాదునగరములోని ఎలక్ట్రిక్ కంట్రాక్టరుగారగు పీ. పాండురంగంగారి కుమారులు. వీరు మెట్రికులో ఎఫ్ ఏ. లోను మొదటిదర్జాలో ప్యాసుఅయినారు. మద్రాసులోని వైద్యపరీక్షలోను వీరుమంచిదర్జాలోఉత్తీర్ణులై రెండుమూడు బంగారుపతకాలను బహుమతిగా పొందినారు.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర వైశాఖశు॥ ౨

సోమవారము


## సఫాయి కూలీలు.

హైదరాబాదు నగరములో పారిశుద్ధ్యమును కాపాడుటకై సుమారు ౩౦౦౦ మంది శ్రమజీవులు (Labourers) ఏర్పాటై యున్నారు. వీరి అదృష్టవిశేషముచేత పురపాలక సంఘాధికారిగా (నాజిం) నవాబ్ మెహిదీ నవాజ్‌జంగుబహద్దరుగారు లభించియున్నారు. నవాబుగారు అధికార వర్గములో అత్యుత్తమ శ్రేణిలో చేరినట్టివారు. ఇట్టివారే రాష్ట్రమంతటను అధికారవర్గములో బహుళముగా ఉండిన రాష్ట్రమందేశములోను, ఏమూలలోను, ఏ అల్లరికాని అశాంతికాని జరుగక రాష్ట్రాభివృద్ధి బహు శీఘ్రకాలములో జరిగి రాష్ట్రము కీర్తివంతమై యుండును. నవాబుగారికి మతపాక్షిక మన్నమాట కించిత్తుకూడ లేదు. అన్యాయమును వారుసహించరు. ఏవిధమైన పక్షపాతము వారిలో లేదు. ఉత్తమసాత్విక స్వరూపులు. దయార్ద్రహృదయులు. బీదలపై వారికుండు ప్రేమ ఇతరత్ర చాలఅరుదుగా కనబడును. ఇట్టివారి పరిపాలనలో హైదరాబాదునగర సఫాయివర్తించుచున్నందున దాని అభివృద్ధి క్షేమాభ్యుదయము లోటుఉండదు.

నవాబు పదవీస్వీకారముచేసిన తరువాత ఎన్నియో క్రొత్తక్రొత్త ప్రణాళికలను ప్రవేశపెట్టినారు. కొన్ని ఉచితపాఠశాలలను స్థాపించినారు. వయోజన విద్యకు ప్రోత్సాహ మిచ్చినారు. కూలీల ఆర్థిక సామాజికస్థితిని వృద్ధిపరచుటకై ఎంతయో పాటు పడుచున్నారు. హైదరాబాదు నగరములోని వీధులను ఊడ్చి, పెంటలనెత్తి నీరుచల్లి పరిశుభ్రముగా నుంచువారు ఇంచుమించుగా అందరును హరిజనులే. అందరును అతిదరిద్రులే. అందరును నిరక్షరకుక్షులే. వీధుల నూడ్చుటకన్న హీనమైన కార్యమున్నదనిన ఒక్కటే ఒక్కటి కలదు. అది మలమూత్రపు దొడ్లను (పాయిఖానాలను) తోసుట. వీధులలో సర్వరోగాల క్రిములు చేరియుండును. అట్టిక్రిమియుక్తమగు దుమ్మునుఊడ్చి ఒళ్ళంతయు కొట్టుకొని, అదుమ్మునే పీల్చి మలినులై అదే మలినస్థితిలోనే స్నానమైనను ఎరుగక పుష్టిరహితమును అరుచికరమును అసహ్యమును అగుతిండి తిని జీవయాత్రను గడపు ఈహరిజన కూలీలను నవాబు మెహిదీనవాజ్‌జంగు బహద్దరుగారు తనపిల్లలవలె ప్రేమించుట సామాన్యవిషయము కాదు.

౮౫ ఏండ్లనుండి సఫాయివారెవ్వరు నుచేయనిపని నవాబుగారు చేసినారు. ఈకూలీలకు తలాఒకరూపాయి నెలజీతము హెచ్చించి దానిని వారిక్షేమాని కేవినియోగించుటకై భీమాపద్ధతి యేర్పాటుచేసినారు. కాని మూర్ఖులైనయీ కూలీలకు భీమాలాభాన్ని గురించిచెప్పె నాయకులులేకపోవుట చాలా విచిత్రముగా ఉన్నది. హైదరాబాదు రాష్ట్రములో హరిజననాయకుల చర్యలుచాల శోచనీయముగా ఉన్నవనుటకు వేరుచో ప్రకటింపబడిన ఒకలేఖ చదివిన కొంత అర్థముకాగలదు. సుమారు ౩౦౦౦ హరిజనకూలీల కష్టములుఒక్క హరిజననాయకుడైనను విచారించెనా? ఒక్క ఆంధ్ర మహాసభనాయకుడైనను విచారించెనా. ఒక్కహిందూప్రజామండలికుడు విచారించెనా? అందరును పెద్దపెద్ద తీర్మానాలు చేయుటకు స్టేటుమెంటు లిచ్చుటకు, సంతకాలు పెట్టుటకు రంగాలపై ముక్తకంఠముతో శ్రీరంగనీతులు ఝూడించుటకు తొందరగా ముందుకు వత్తురేకాని నవాబుగారివలె బీదలసేవచేసిన వారిని చూపించ జాలముకదా!!

నవాబుగారికి కొద్దిగా తెనుగువచ్చును. ఆతెనుగులో లోపమున్నది కదా అని వారుఉర్దూలో మాట్లాడరు. ఈహరిజనులతో తమకువచ్చిన తెనుగుతోనే మాట్లాడుదురు. ఎందరిట్టి భాషౌదార్యమునుప్రకటించువారుందురు? చాలా కొద్దిమందియే!

నవాబుగారు బీద శ్రమజీవుల ఆరోగ్యానికి గాను ఆరోగ్యవసతులకుగాను, ఉచితవైద్యచికిత్సకుగాను, ఉచిత విద్యకుగాను, మంచియేర్పాట్లుచేసినారు. ఇంకనుచేయుచున్నారు. ఈ కూలీలకు రెండు గొప్ప జాడ్యములుకలవు. (౧) మద్యపానము (౨) అప్పులు. సాయంత్రమగువరకు కల్లు సారాయి దుకాణాలవద్ద హాజరీయిచ్చి చాలామంది స్త్రీ పురుషులు మద్యపానముచేసి మతిచెడినస్థితిలో ఇంటికిపోయి అసభ్యముగా వర్తించుచుందురు స్థితివత్తురు. ఈ విధంగా నష్టపడుటయేకాక వీరుదిల్లరఅప్పులు చేయుదురు. ఆయప్పులకై వారిచ్చే వడ్డినిచూచిన పెద్దపెద్ద బ్యాంకులవారును, కోటీశ్వరులును, మూర్ఛపోగలరు. వీరిచ్చేవడ్డిని లెక్కవేసిన సాధారణముగా సంవత్సరానికి నూటికి ౮౦ం రూపాయీల వడ్డినియిత్తురు. వడ్డికై అప్పిచ్చినవారు సాధారణముగా అసలుతీసుకొనరు. వడ్డికానులుమాత్రము కత్తిజళిపించి,కర్రచూపి,కడపపై కూర్చుని, భయపెట్టి, నిర్బంధించి నానా భీభత్సపెట్టి వసూలుచేసుకొని పోదురు. ఇట్టి భీభత్సము లనుభవించుచున్నను ఈ శ్రమ జీవులకు బుద్ధిరాదు. ఈరెండు జాడ్యాలకు నవాబుగారు తగినచికిత్స చేయించు ఆలోచనలోకూడా ఉన్నారని వినిన ఆనందించని వ్యక్తులుకొందరుమాత్రమే ఉందురు. వారు కలాలీవారును అప్పిచ్చువారును!!

నవాబుగారి ఉత్తమోత్తమగుణములను మేముమనఃపూర్తిగా అభినందించుచు వారికిపరమేశ్వరుడు సకలైశ్వర్యాయురారోగ్య భాగ్యములను ప్రసాదించుగాక అనిప్రార్థించు చున్నాము. బీదకూలీల ఆశీస్సులును సర్వదానవాబుగారి శ్రేయస్సునకు ఉకరింపక మానవు.

## గాలికుంటువ్యాధికి చికిత్స

(అభినవసహదేవ శ్రీ దేశిరాజు శ్రీరాములు చౌదరిగారు)

పశువులకుగాలి కుంటువ్యాధి తగిలినకాటనే నీరుబియ్యపునీటిలో అరతులం నూనె కారంకలిపి దినమునకొక్క సారి కడుపునిండునటుల రెండుదినములిచ్చినచో పలిజ్వరము తగ్గి పుండ్లుపడినను తేలికగా తీసిపోవును. తరువాత ఉప్పు ౨ తులములు మంచి బెల్లం ౧౦ తులములు పటికపొడి పావుతులము, నేలవేముపొడి అరతులము మెత్తగానూరి అప్పుడప్పుడు పశువునకు కాలించినయెడల కోటిలోపల శరీరములోపలనుండుపుండ్లు గాతిపట్టును. శ్లేష్మము తగ్గించును. జ్వరముపోవును. జీర్ణశక్తి కలుగును. నోరు ఆరోగ్యకరముగానుండును.

పశువులకుకూడ వాతపిత్తకఫములున్నవి ఎండలు తీవ్రముగానున్నపుడు గోవ్యాళ్లు, పెసలు, పులగముగావండి మంచినూనెలోకలిపి పెట్టుచుండిన యెడల బలవర్ధకౌషధముగను, మేహశాంతిగను పనిచేయును. అప్పుడప్పుడు జల్లెడుచిగుళ్ళు వాసన చూపించుటమంచిది. ఇట్లుచూపించుటవలన క్రిములుచచ్చును.

### పుండ్లకు సలహా

గవర్నమెంటు వెటరినరీ హాస్పిటలులో పొటాషియం పర్మాంగనేట్ లోషనుతో మనపశువుల గాళ్ళపుండ్లుకడగగానే అవెంత్యాదాలముం చిదుండుటో కడుగుచున్నారో యని భ్రాంతిపడు అమాయకప్రజలు తలిదుటికూడ చాలమందియున్నారు. నోరుతెనివకపులు సంతోషించుచున్నా, కేదు కొంచెముసమయముందేవద్దనోరకే మనముశ్రాదం నాటి కుమ్మకాయ, రావికాయ కషాయముల కంటె ఈదాలుసరిపడుటే మిపనిచేయును! పుండ్లకులెకారముగా మనకొక్క కషాయముల ఇంగ్లీషుమందులకంటె అత్యద్భుతముగా పనిచేయును. నేనుకూడ అన్నిటినివాడిన తరువాత నీమ కసలభానివ్వుచున్నాను.

### పురుగులుపడిన పుండ్లకు

పుండ్లమీద ఈగలుప్రాలకుండా వేపనూనెలో నీలిమందు మార్దకర్పూరంకలిపి రాసిన పుండు గారిపట్టును. ఈగలుప్రాలవు. రసికారుటతగ్గును. అంతకును పురుగులుపడినయెడల కుక్కవాయింటాకుగాని, పచ్చిపొగాకుగాని, సీతాఫలంపు ఆకుగాని, మాచిపత్రిగాని నలగతొక్కి పసపాటి కొంచెముగుల్లనున్న ముద్దకలిపి పట్టించినటుపాకాయచేసినట్టు పురుగులన్నీ చచ్చి గాయము మార్దవాగును.

భగవంతుడు సృష్టించినవ్యాధులలో గురకరోమ్ము, మొదలుఎన్నైనాతగ్గించినాకేమో యిన్నిగాయండి. ఇంతవరకు ఎచ్చటకనుగొనలేదనియే చెప్పవచ్చును. కాబట్టిపతిరైతు స్వయంగ్రహితోచిత పశువులనుకాపాడమని ప్రార్థిస్తున.

### ఫినైలువల్ల నష్టము

పురుగులుపడిన పుండ్లలో ఫినైలునువేసిన పురుగులుచచ్చును. కానిచాలమంది పురుగులుచచ్చినప్పటికీ ఫినైలునువేయుదురు. ఇట్లుచేయుటవలన పుండుపెద్దదైమానదు. కాబట్టిఅట్లుచేయకుడు. పురుగులుచచ్చినపుండుకు కొబ్బరినూనెయందు మా వేపనూనెలోకలిపి రాయవచ్చును. లేదా బ్రహ్మదండి సమూలరసములో పసుపుకలిపిరాయవచ్చును. బొంకుపానుపసరులో పసపొడికలిపి రాయవచ్చును. ఈరీతిగా నాలుగుదినములువాడిన ఈగలువాలవు. పుండు గారిపట్టును.

### రైతులచెడ్డఅలవాటు

కొంతమంది ఈవ్యాధితగిలి పుండ్లుపడి రసికారుచున్నపుడు దుమ్ము, తవుడుకొట్టుదురు. బురదలోతొక్కించుదురు. ఇదిచాలాపెటుపద్ధతులు ఇంతమాత్రమున పుండ్లుమానవు. పురుగులుచావవు. కాబట్టి కుమ్మకాయ రావికాయ పెచ్చుతీసి లోపలిసలసలకాగనిచ్చి గోరువెచ్చనిపాలతో పుండ్లనుశుభ్రముగా కడిగి పైచట్నాలను ఉపయోగించినబాగుగాపనిచేయును.

### రసికారుపుండ్లకు

కుమ్మకాయపొడి ౪ తు. వేపకాయపొడి ౫ తు. తెల్లగుగ్గిలము అర తు, నీలిమందు అర తు. మణిశిలాగు ౨ తు. కర్పూరము పావు తు. కలిపిఅప్పుడప్పుడు జల్లుచుండినచో పుండ్లలోని రసిస్రవించి గారపట్టును. పశువులు నాకకుండమాత్రముచేయవలెను.

(ఆంధ్రప్రభ)

### పాఠకులకు మనవి

యుద్ధానికిపూర్వము మా పత్రికకు వినియోగించు కాగితము ఒక రీము క్రయము ౨-౪-౦ ఉండెను. తర్వాత మనప్రభుత్వమువారి అనుగ్రహాన ౫-౮-౩ అయ్యెను. ఇప్పుడు ౮-౧౨-౦ అయినది. అనగా పూర్వముధరకంటె నాల్గింతలు హెచ్చుగా ధరపెరిగినది. ఇదివరకే మేము దీనిమూలాన అపార నష్టమును పొందినాము. ఈవిపరీతపు ధరలతో స్వల్పముగా నిర్ణయింపబడిన చందాతో మేము ఇకముందు ౧౦ పుటలు ప్రచురించజాలము. ఇక ముందు ౮ పుటలు మాత్రమే ప్రకటింపబడును. మరల ధరలు తగ్గిననాడు ఆ సంగతిని పాఠకులకు తెలుపుకొని యథాప్రకారము ౧౦ పుటలలో తీయగలము. మా యీకష్టాలను గమనించి పాఠకులు మాయందభిమానముంచి ప్రోత్సహింతురని ప్రార్థన. ఇక ఈ సంచిక తర్వాత ఒకసంచిక మాత్రమే వెలువడును-అటు తర్వాత మా ౧౫ వ సంవత్సర మారంభమగును.

సంపాదకుడు,
గోలకొండ పత్రిక.

## నల్లగొండ జిల్లాలో పశుచికిత్స

హైదరాబాదు ప్రభుత్వమువారు నల్లగొండలో క్రొత్త పశుచికిత్సశాలను నిర్మించుటకుగాను ౧౩౦౦౦రూ॥ వ్యయముచేయుచున్నారు. ౧౩౪౯ లో ౧౨౦౦౦వ ౧౩౪౯ ఫ.లో ౧౫౦౦౧పశువులను నల్లగొండలో చికిత్సపొందినవి- ౨౨౦౦౦పశువులకు టీకాలంతిని అంటువ్యాధిని నిరోధించినారు. యక్షితీదీపముద్వారాను కరపత్రాలద్వారాను పశుచికిత్సలవిషయమై పశుశాఖవారు నల్లగొండజిల్లాలో ప్రచారముచేసినారు. ౧౩౪౯ ఫ. లో పైజిల్లాలో ౧౯౦౦౦రూ॥ వ్యయమైనవి.

## భువనగిరి తాలూకా ఆంధ్రజనసంఘ స్థాపన

(ఒ వి) భువనగిరి ౧౪-౩-౫౦ఫ.

నేను నల్లగొండనుండి భువనగిరి అష్టమాంధ్ర మహాసభ విరాళములు ప్రోగుచేయు సందర్భమున శ్రీయుత పి.రంగారావుగారు, ఎం. రామచంద్రారెడ్డి (జిల్లాసంఘాధ్యక్షులు) ఉదయం తొమ్మిదిగంటలకు దయచేసిరి. ఇక్కడి సంస్థానము ఖుఅనుచూచి సాయంత్రము౫గంటలకు శ్రీయుత పన్నాల వెంకటరెడ్డిగారిభవనమున సమావేశపరచి తాలూకాసంఘమును స్థాపించిరి. ఈక్రింది వారు తాలూకాసంఘమునకు సభ్యులుగా ఎన్నుకొనబడి అంగీకరింపబడిరి.

శ్రీయుత రాందయాళ్‌సేటుగారు అధ్యక్షులు,

,, కె. రామయ్యగారు ఉపాధ్యక్షులు,

,, పన్నాల వెంకటరాంరెడ్డి, గోపాల్‌రెడ్డిగార్లు కార్యదర్శులు-మరియు ౪గురు కార్యనిర్వాహకసభ్యులు,

సభ అయిదున్నరగంటలు సాయంత్రి ముగిసెను. నేటినుండి మహాసభవరకు యీతాలూకాలో సాధారణసభ్యులసంఖ్య (౩౦౦) కుతక్కువగా కుండాచేయు బాధ్యత సభవారియందుండునని (తాలూకాసంఘము)అందుకుఉపాధ్యక్షులు మరియు కార్యదర్శిగారు రెక్కప్రశ్రద్ధ వహించుదని కోరబడిరి. సభాచర్య శ్రీపురిజాల రంగారావుగారి అధ్యక్షతతో జరుపబడెను.

## మహారాష్ట్ర పరిషత్తు

పైపరిషత్తుసభ మేనెల ౧౪ ౧౫ ౧౬ తేదులలో కాశీనాథరావు వైద్యగారి అధ్యక్షతలో ఉద్గీరు స్థలములో జరుగును.

## ఫ్రాన్సులో పరిస్థితులు

ఫ్రాన్సులో జర్మనులంఆక్రమించియున్న భాగమునుండి వచ్చిన జేలిక్ స్కాట్ అను పత్రికాధిపతి సమాచారాలు విచిత్రముగాను న్నవి. ఇప్పుడుఫ్రాన్సులో పెటెయిన్‌గారి మంత్రివర్గంలో ఉపప్రధానియగు డార్లన్ గారు ఇదివరకుండిపోయిన లావల్ గారికంటె బ్రిటనుకు శత్రువుగానున్నారుట. మధ్యధరాసముద్రంలో బ్రిటిషు యుద్ధనౌకలను ఫ్రెంచివారియుద్ధనౌకలు ఓడించగలవని వారిఆశయమట. ఇప్పుడుఫ్రాన్సులోనూటికి 90 మందిజనులు బ్రిటిషువారివిజయమునే కోరుచున్నారట. కానివారలుశక్తిహీనులై బ్రిటిషువారి జయమునకై ఏమియుక్రియచేయలేకయున్నారట. తక్కువనూటికి అయిదుగురుజనులనంటే ప్రజలు జర్మనుల కనుకూలురట. ఫ్రెంచిప్రభుత్వాధికారులువారలఅధికారమంతేయున్నదట, ఇపుడుఫ్రాన్సులో చిన్న చిన్న నేరాలకే మరణదండనలు వేయుచున్నారట. ఒక్క పెటెయిను గారుమాత్రమే మర్యాదగలవారట. అతనుక్రిందపనిచేసేఅధికారులందరు స్వార్థపరులై జర్మనుకేమి చేయుచున్నను పట్టించుకొనరట ఇపుడుఫ్రాన్సులో జర్మనులాక్రమించినభాగంలో జర్మనుసేనల నుంచినందుకు ఫ్రెంచివారు రోజుకు ౨కోట్లమాంతుల ఫ్రాంకులు ఇచ్చిన పరిపోయినను, జర్మనులుఇంతకంటేంగా ఆంకోట్లఫ్రాంకులు వసూలు చేయుచున్నారట. మిగిలినదబ్బుతో ఫ్రాన్సులోనిపరిశ్రమలను జర్మను లుకొనివేయుచున్నారట.

## భర్తనురక్షించుటకై భార్యసాహసము

పూనానగరంలో ఏప్రిలుగంవ తేదిరాత్రి ౧౧ గంటల పేటలో ౨౫౨విండ్లవయసుగల ఘుబ్బార్థాను ఎవరో కత్తితో పొడువగా అతనిరోదనమువిని ౧౨ అడుగులఎత్తు బాబాహైనుండి అతనిభార్య ఒకబంబియారుట్టుకొని అక్కడినుండి దూకి వచ్చెను. ఈలోగా అవచ్చిన దుర్మార్గులు పారిపోయిరి.

## అఖిలభారత పద్మశాలి అష్టమమహాసభ

తేదులలోమార్పు

(పాలాఘూరు)

పరగ్రామములనుండి వచ్చే ప్రతినిధుల సౌకర్యముల కొరకున్ను, స్థానికబాంధవుల సౌకర్యముల కొరకున్ను మొదట నిశ్చయింపబడిన తేదులలో మార్పుకలిగి తేదిగ౬–౨౭–౨౮–౨౯ మే ౧౯౪౧లో సభలుజరుపుటకు నిశ్చయింపబడినది. కొబట్టి పద్మశాలి బాంధవులందరు సభలకు తప్పకరావలయునని కోరుచున్నాను.

ప్రధానకార్యదర్శి

## రష్యా బెల్జియముల ఒడంబడిక

బెల్జియమునకు ఆహారపదార్థములు సప్లయిచేయుటకుగాను రష్యా-బెల్జియము దేశములలో ఒడంబడిక చేసుకొన్నవి.

బహుశః ఈ ఒడంబడిక జర్మనీవారి అంగీకారముతోనే చేసికొనబడియుండును. ఆహారపదార్థముల కొరతవలన యితర సామ్రాజ్యదేశములకంటె ఎక్కువగా కష్టపడుచున్న బెల్జియమునకు ఒడంబడిక చాలసహాయకారిగానుండును. రాబోవు ౧౨ మాసములలో రష్యా బెల్జియమునకు గోధుమలు, క్రొవ్వు సప్లయిచేయును. బెల్జియము రష్యాకు ఇంజనీరింగుసామానుపంపును.

## అమెరికాలో క్రొత్తపన్నుల భారం

ఏప్రిల్ ౧౫వ తేదిన అమెరికా ఖజానా కార్యదర్శియగు మార్గెంథూగారు ఇట్లు ప్రకటించినారు

అమెరికాప్రభుత్వానికి జరుగబోవు సంవత్సరములో అత్యధికర్చులలో మూడింట రెండువంతులయినను అధమపక్షము ప్రజలవద్దనుండి పన్నుల రూపంగా వసూలుకావలెను. అందువల్ల యీరాబోవుసంవత్సరం ౩౫౦ కోట్లుడాలర్లు అధికంగా పన్నులరూపంగా వసూలుకావలెను. ఈ క్రొత్త సంవత్సరం ౧-౭-౪౧ తేదిని ప్రారంభమగును. రాబోవుసంవత్సరంలో ౧౯౦౦ కోట్లుడాలర్లు మొత్తంఖర్చులగును. ఇప్పటిపన్నులవలన ౮౦౦ కోట్లుడాలర్లుమాత్రమే వసూలుకాగలవు. ఇంకను ౩౫౦ కోట్లుడాలర్లు కావలెను. ఇవిగాక మాసానికి ౫౦ కోట్లుడాలరులచొప్పున అప్పుచేసి సైనికవ్యయములను భరింపవలసియుండును. అరువుకవులుచట్టము ననుసరించి కగులబడియగుఖర్చు భరించవలెను.

## ఫ్రెంచి మంత్రివర్గంలో గొప్పమార్పు

ఫ్రెంచినౌకాదళము జర్మనులకు సహాయకారిగా పనిచేయుటకై ఇవ్వబడవలెనని లావాలుగారు వాదించుచుండిరి అందుకు అతడు అంగీకరించెను. అందువల్ల అతడు హిట్లరుకోరికప్రకారముగా ఫ్రెంచి మంత్రివర్గములో చేరనున్నాడు. లావాలుగారు ఫ్రెంచిమంత్రివర్గములో చేరినయెడల ప్రస్తుతం ఫ్రెంచిమంత్రివర్గములో ఉన్నవారు కొందరు తొలగిపోవలసి వచ్చును. కొన్నిమార్పులు మంత్రివర్గములో జరుగగలవు. అడ్మిరలు డార్లను తొలగిపోడు. సైనికశాఖా మంత్రియగు హంటీగరుగారు తొలగిపోవచ్చును.

ఫ్రాన్సును జయించిన పిమ్మట జర్మనీతో వ్రాసికొనబడిన యుద్ధవిరామపత్ర షరతులను మించి జర్మనీ ఫ్రాన్సునెక్కువగా కోర్చుడ నక్కరలేదని హంటీగరుగారి మతము.

## జపాను విదేశాంగ విధానము

ఒక్కసారి హఠాత్తుగామారదు

జపానువిదేశాంగమంత్రిఅగు మత్సుఓకా యూరోపుఖండంనుండి తిరిగివచ్చినవెంటనే ఒక్కసారిహఠాత్తుగా జపానువిదేశాంగ విధానములో మార్పుఉండదని జపానుప్రభుత్వప్రచురణశాఖ ప్రతినిధి కోహిషీగారు ఏప్రిలు ౧౯వ తేదిన పత్రికాప్రతినిధులసభలో చెప్పిరి. అయితే జపానురాజ్యాంగతంత్రంలో కొలదిమార్పులుజరుగవచ్చుననిరి. అదివరకువలెనే చుట్టుప్రక్కలదేశములతో శాంతసంబంధములుగలిగియుండవలెననే విధానములో మాత్రం మార్పుఉండదనిరి. కోహిషీగారు మరొకప్రశ్నకు సమాధానంచెప్పుతూ అమెరికా రాజ్యముల సరకునౌకలవెంట యుద్ధనౌకలను పంపుట తెలివైనపనికాదనియు, అమెరికను ఓడలు చాలజాగ్రత్తగా ఉండవలెననియు చెప్పిరి.

## అమెరికా సరకునావలు ఇంగ్లాండుకు సప్లయి

అమెరికాయొక్క సరకులనావలు ఇంగ్లాండుకు అరువుకవులు చట్టమునను సరించి సప్లయిచేయుటకై అమెరికాప్రభుత్వమువారు తమదేశములోని నౌకావ్యాపారసంఘములకుచెందిన కొన్ని నావలనుకొని సప్లయి చేయుచున్నారు.

## లిబియా ఈజిప్టులపై జర్మనుదాడికి ఫ్రాన్సు బాధ్యత

"బ్రిటిషుప్రభుత్వము సహించి ఊరుకొనదు"

లిబియా ఈజిప్టులలో జర్మను పురోగమనము అడ్డుటకు కొన్ని స్థలములలో బ్రిటిషుసేవలు కేంద్రీకృతమైయున్నవి. జర్మనులీస్థలములవరకు ముందుకువచ్చిచో ఘోరమగుయుద్ధము తప్పదు: ఈయుద్ధములో విజయముపొందనిదే ఉత్తరముగా ఈజిప్టు తూర్పుకొనసాగుచున్న సూయజుకాలువను అలెగ్జాండ్రియాను జర్మనులుచేరుకొనజాలరు. ఇట్లు చేరుకొనజాలకుండ ఇంకొకపెద్దఆటంకమును పూడ కల్పించుచున్నారు. సాహసించి ప్రవేశించిముందుకుపోవుచున్న జర్మనుటాంకుల సైనికులకు, వెయ్యిమైళ్లదూరమునున్న ట్రిపోలీనుండి సప్లయిలు రావలెను. సప్లయి ఎచేరకుండ మధ్యదారిలో చాలాచోట్ల బ్రిటిషువిమానము అడ్డుకొట్టగలవు అప్పుడు ఈజర్మనుటాంకులదళము నిర్వీర్యమైనిరుపయోగముగను రూపుమాపబడి పోజాలదు

## అయిర్లాండు రేవులు అమెరికాకు యివ్వము

ఐర్లాండుదేశపు యుద్ధశాఖా మంత్రియగు అయికేనుగారు అమెరికాలో ఐర్లాండుమిత్రులకు అమెరికనుల సమాజమువారి యాజమాన్యమున ఏప్రిల ౧౯వ తేదిన జరిగిన సభలో యిట్లుచెప్పిరి. అమెరికానుండి ఆహారవస్తువుల సప్లయిల నిమిత్తమై అయిర్లాండులోని రేవులను అమెరికాకు అమ్ముకొనుట, ఎన్నటికిని జరుగనేరదు.

## రష్యాలో జరమనురాయబారి

స్థితిగతులు తెలుపుటకు బర్లినుకు వచ్చెను.

రష్యాలో రాయబారిగానున్న కౌంటువాన్ షలెన్బర్గుగారు ఇప్పుడు బర్లినులో నున్నారు. ఆయన స్థితిగతులు తెలుపుటకై వచ్చినట్లు తలపబడుచున్నది. గతవారము యుగోస్లావియాపై హంగేరీ గావించినదండయాత్రను సోవియటు ప్రభుత్వము ఖండించిన తరువాత షలెన్బర్గుగారు మాస్కోను వదలివచ్చిరి.

